# నడుమంత్రపు సిరి



శిరోమణి

సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి

Proficient in Oriental Learning.

వెల 0-4-0

TO

MY REVERED GURU

SATAVADHANI

VELURY SIVARAMA SASTRY GARU

this book is respectfully dedicated.

# పీఠిక.



చ. అతివకుచంబులున్ మెఱుగుటారును, వేనలియున్, ధరాధిపో
న్నతియు, నహీనభూతికలనంబు, ఘనాభ్యుదయంబు నిప్పుడోం
జితిమని "మాటిమాటికిని నిక్కెడు, నీల్గెడు, విఱ్ఱవీగెడున్,
క్షితినిటుగాదె! యొక్కొకరికిన్ నడుమంత్రపుఁ గల్మిగల్గినన్"

అనువిజయ విలాసములోని పద్యము నన్నీ చిన్ని పాత్రమును వ్రాయుటకుఁ బురికొల్పినది. కావునఁ జేమకూర వేంకటకవికి నే నాజన్మాంతమును గృతజ్ఞుఁడను.

లోకవృత్తమును వర్ణించుటయే నాయుద్దేశము కానీ యొకవ్యక్తిచరిత్రముగాదు. యాదృచ్ఛికముగా నిందలి విషయము లే వ్యక్తికేని సంబంధించిన సంబంధింప వచ్చును. దానినిఁ బురస్కరించుకొని "గుమ్మడికాయల దొంగయన్న బుజాలుతడవుకొన్న" విధమునఁ దమ్ముఁగూర్చియే యీ పాత్రము వెలువడినదని నాపైఁ గినియవలదనివారిని సప్రశ్రయముగాఁ బ్రార్థించుచున్నాను.

ఇందలి యతిభ్రంశములు బుద్ధిపూర్వకములు గాని ప్రమాదపతితములుగావని మనవి.

గ్రంథకర్త.

శ్రీ పరదేవతాయైనమః.

# నడుమంత్రపుసిరి

మ. అరిషడ్వర్గము గెల్చి, తాల్చి మెయి లో
కానుగ్రహార్థంబ, యు
ర్వర కాచార్యకమూని, స్వర్గముఁ దృణ
ప్రాయంబుగా నెంచుచున్
బరమజ్ఞాన నిరస్తపాపులయి త
ద్బ్రహ్మాను సంధాన త
త్పరులై కాలముఁబుచ్చుచుండి రెలమిన్
బ్రాచీన విప్రోత్తముల్. 1

క. కలిగిరిసీ! పులులకు మేఁ
కలవలె మామిళ్ళ ముసిఁడికాయల పగిదిన్
బలుదుర్గుణముల ప్రోవులు
గల సంతతివారు కాలగతి వారలకున్. 2

క. తలక్రిందుగాఁగ విధి దు
ర్విలసితమునఁ జేసి యాగరిమ యెల్లయుఁ గే
వల మిలను నేతిబీరల
వలె బ్రబడి కెడు నొక్క విప్రవంశమునందున్. 3

చ. శవములు మోసి కూలికయి
శ్రాద్ధపుఁ గర్మలుసేసి వృద్ధతన్
జివికియుఁ దీర్ఘకాకమయి
నిచ్చలుఁబట్టుచు నీటికాసులన్
దవిలి పరిగ్రహించు చుచి
తజ్ఞతలేక తిలాదిదానముల్
భువినొక బ్రాహ్మణ బ్రువుఁడు
పొల్చును మూర్తపుఁ బాపమోయనన్. 4

ఉ. వేఁగకమున్నె, ప్రాఁచియిలు
పెంటయునూడ్వకమున్నె, వెల్తురున్
బాగుగ రాకమున్నె, ముఖ
మార్జనసేసియొ? లేక కార్యపున్
వేగముఁబట్టి చేయకయొ?
పిల్లలకుంచిన "చద్దివణ్ణమున్"
మాగిన చారుతో మెదిచి
నాలుగు గ్రుక్కల మ్రింగువిస్తరిన్. 5

ఉ. ఆననమందు, హస్తముల,
నక్కుపయిన్, మెడక్రింద, వీపునన్
గానఁబడంగ వాతలనఁ
గా వెలిబూడియఁ దీర్చి రేకలన్

బూనియు నెఱ్ఱకుంకుమము
భ్రూయుగమధ్యను, బ్రాఁత సేలువన్
బైనిముడించి, మైలవలు
వల్ ధరియించి యతండు గ్రుమ్మఱున్. 6

సీ. ఈఁగ యీనినదన్న నేరీతి నెఱుఁగునో !
పక్షియై వాలు నప్పట్టు నందుఁ!
గ్రొత్తకుండందద్దుకొను చుండెరనెట్లు
పసిపట్టునో ? యూడిపడునచటకుఁ !
బచ్చుతోరణఁగట్టఁ బ్రాఁకునో ! యేమొ ! యా
గంధ మాత్రృటినె సాక్షాత్కరించుఁ !
బసుపుమ్రుగ్గులు దీర్చవాఁకిట, వీచునో !
యాగాలి, దూఁకి ప్రత్యక్షమగును.

గీ. మంగళామంగళంపుఁ గర్మములయందు
నొక్కవేషమె; యొకతీరె; యొక్కచదువె;
కాసు వీసంబులకు నూరుక్రోసులేనిఁ
బఱచు గౌరవదూరుఁడా బాపనయ్య ! 7

క. కలఁగాంచును బితృమేధం
బులఁదాఁజేయించునట్లు, భోక్తగ శ్రాద్ధం
బులఁగూరుచున్నగతిఁ, దనుఁ
బిలిచినక్రియ నెవరొవచ్చి పీనుఁగుమ్రోయన్. 8

క. తొలుసంజ కిల్లువెడలును
మలుసంజకుఁ దిరిగితిరిగి మరలున్ మరలన్
గలగూర మూటఁ దాలిచి
తలపై నస్సుస్సురనుచు దారిబడలుచున్. 9

గీ. కాసునకు గవ్వకును గూడ గడ్డికఱచుఁ
బ్రాణమునకును బైసకు లంకె వెట్టుఁ
గట్టి ! కల్పకాలము దాఁక నుట్టిగట్టి
యూఁగులాడంగ, దలఁచినాఁ డోటతండు. 10

గీ. ఎండమాడ్చుచున్న, నఖండగతినిఁ
గుంభవృష్టిని వానలు గురియుచున్న
మంచుపైఁ గ్రమ్మి శీతంబు నొంచుచున్న
నిత్యకృత్యంబు విడువఁడా నీచవృద్ధు. 11

చ. శనియెదురైన యట్టులఁ, బి
శాచము వచ్చుచున్న భాతి, మైఁ
గొనివిహరించు చున్నగతి
ఘోరతమంబగు ప్రేతకర్మ, యా
తనిఁగని యేవగించుకొని
దాఁటిఁదొలంగుచు దవ్వ దవ్వగాఁ
జనుదురు భీతభీతులయి
సర్వజనంబశుభాప్తి శంకమై. 12

సీ. తమ గృహంబున కరుదెంచి తరలఁగానె
యతని త్రొక్కినత్రోవ దూష్యముగఁ దలఁచి
ప్రజలు చల్లుచునుందురు పసుపునీళ్ళు
గోమయోదకములు మఱిం గొన్నితఱుల. 13

గీ. ఎట్టిపుణ్యంబుఁ దొలిఁజేసి పుట్టినాఁడొ ?
ఏమహామంత్రమును జపియించినాఁడొ ?
ఏకఠోరవ్రతంబు వహించినాఁడొ ?
ఇట్టి పావన జీవనంబెనయ నతఁడు. 14

క. తనవిద్యనె నేర్పించెద
నను బిడ్డల కతఁడు; భార్యయాంగ్లముఁజదివిం
చినఁ బెద్ద జీతమిచ్చెడు
పని దొరకునటంచు సతముఁ బతిఁ బోర్పెట్టున్. 15

క. ఒకకాల బడికిఁ బోవుచు
నొకకాలం దండ్రితోడ నూరఁ దిరుగుచున్
బ్రకటించు చంద్రు పుత్రకు
లకలంకతఁ దల్లిదండ్రులందలి భక్తిన్. 16

ఆ. వె. శ్రాద్ధభోజనములు, సంభావనలు, స్వస్తి
వాయనములు. నిత్యపంట లగుట
నా కుటుంబమునకు, నవి లేని నాళ్లను
బడికిఁ బోవుచుంద్రు వాని సుతులు. 17

గీ. బడికిఁ దప్పక చనమి నన్వహముఁ బ్రాఁత
పాఠములురాక క్రొత్తవి పట్టు వడక
యెట్టి పొత్తంబు లేకయు నెద్దివారు
చదువుచుండిరో? బ్రహ్మయుం జాలఁడెఱుఁగ. 18

క. గురువుల యనుగ్రహముననో?
పురాకృతంబైన యెట్టి పుణ్యంబుననో?
తరియించు నప్పు డప్పుడు
పరీక్షలను బెద్దవాఁడు వారలలోనన్. 19

గీ. దండయాత్రలు గొట్టుచు దైవకృపను
దాఁటి మెలమెల్లఁగాఁ బది తరగతులను
అలఁతిగా డొక్కశుద్ధిఁ బెద్దతఁడు వడసెఁ
దక్క పిన్నలు బెను బహుద్ధాయు లయిరి. 20

క. వెంకఁడు క్రమ క్రమంబుగ
వేంకటరావయ్యెఁ; గూర్చ్వవిడిచి కలంబున్
లంకించె; బిళ్ళగోచులఁ
గొంకక విడనాడి వార గోచులుదాల్చెన్. 21

క. పురమందరమున కనుదిన
మరుగును బత్రికలఁ జదువ నతఁడార్జించున్
జోరఁబడి యచటి చతుర్ముఖ
పురాణముల వారి వారి ముఖపరిచయమున్. 22

మ. నిలిపెన్ ముంగలఁజుట్టుఁ దొంటిపిలకన్
దీయించి, కొల్లాయుపం
చెలకాదేశ మొనర్చెఁ దెల్లనగుఁగుల్,
స్నేహంబుఁ గావింపఁ బె
ద్దలతోఁ బల్కుఱు వారిచుట్టుఁ దిరుగున్
దద్రీతిగా వేష భా
షల నూత్నత్వముతోఁ ద్యజించెను బురా
చారంబులాతండొగిన్. 23

క. పనియున్నను లేకున్నను
బనిగా ననుదినముఁ బెద్దవారలఁ జూచున్
గనఁబడ్డ చోటులను నె
ల్లను వారికి వంగుచును సలాములొనర్చున్. 24

క. పరిచయ మలంతియేర్పడఁ
బరాచకములాడుఁ, గలిసి వాహ్యాళికిఁ గ్రు
మ్మఱు, వారి బూసికొనుచున్
దిరుగుం, గల్పించుకొని యెదియొ ! మాటాడున్. 25

గీ. పండుగదినాలఁ బువ్వులం బండ్లఁబంపు;
సభలకుంబోయి వారిపార్శ్వముల దూఱు;
నీతిబాహ్యప్రవృత్తుల నిచ్చవారిఁ
గలసి చేదోడు వాదోడుగాఁ జరించు. 26

క. తనమాట చెలామణియగు
నని సాధులపైనిఁ గొండియమ్ముల నొడువున్
జనులెల్లఁ గొంపలార్పం
గనుజాలిన మచ్చితండు గదె! యని తెగడన్. 27

గీ. రోసి దేశాభిమానంబుఁ ద్రోసి వేసి
తనదు జాత్యభిమానంబుఁ దన్ని వేసి
కరుణగడియింప నాయాయి దొరలవెంట
సంచరించును దోఁకనాడించు కొనుచు. 28

ఉ. ఈగతి నాశ్రయించుచు న
నేకవిధంబుల నెట్టకేలకు
ద్యోగమొకండు కూర్చుకొనె;
యోగము మంచిదికాన దానిలో
వేగమె ప్రాపకంబుమొయి
వేతనవృద్ధినతండు పొందుచున్
బ్రోగొనరింపఁజాలెధన
ముం బరగం దనకాలు సేతులన్. 29

క. మెలమెల్ల మెట్లుదాఁటక
కలయాశ్రయబల విమానకలనఁ సామా
న్యుల కందనిదై నసురా
చలశృంగాగ్రమున కెక్కె జన్మతరింపన్. 30

క. నెలతిరుగుసరికిఁ జేతికి
కలగలపెదతెల్లరాళ్లు గట్టిగఁదాఁకన్
మొలకెత్తె నహంభావము
కలయఁగమైకంబు దట్టెఁగన్నులయందున్. 31

క. తలతిరుగుడులును గను బొ
మ్మలవిసరులు నన్నమాట మఱపులు విఱుపుల్
పలుచిట్లింపులు బూటక
ములునేరుచు కొనెనతండు మొదలిటి నుండిన్. 32

క. వినియును విననిఁ తెఱంగులు
గనియునుగానని విధంబుఁ గడునెఱిఁగి యెఱుం
గని చొప్పులభ్యసించెను
దృణీకరణబుద్ధి నాతఁడెదుటి జనములన్. 33

గీ. నోటమాటలాడి నొసలనవ్వుచునుంట
నాసములనుగేల మెలచుచుంట
యొకటి చెప్పియెదుట నొకటికావించుటఁ;
గ్రమముగా నతండు గఱచికొనియె. 34

క. బల్లిదుఁడాత్మస్తుతి కళఁ
గల్లలకాణాచి, ద్రవ్య గర్వమునకుఁ బు
ట్టిల్లుగ నాతండయ్యెను
మెల్లఁగఁ దాదృశులనెల్ల మీరు తలఁపునన్. 35

క. తన చిన్ననాఁటి బ్రదుకును,
దనజనకుని పుణ్యకథలు, దనదగువిద్యా
ఘనతయు, నతండు సంప
ద్ఘనమూర్ఛాపరవశుండు గావుటమఱచెఁ. 36

క. ఆగర్భ శ్రీమంతుని
లాగున, సుకుమారుఁ డట్టులన్, బరమతపో
యోగ భ్రష్టుని పగిదిన్
శ్రీగర్వితుఁ డతఁడు సంచరించుచు నుండున్. 37

ఆ. వె. కాలినేలనుంపఁ గనకంబు రాలునో !
యఱిగిపోవునో ! యటంచు నెంచి
మెత్తనైనపట్టు మెత్తలపైఁగాని
యింటనైన నడుగు నిడఁడు క్రింద. 38

క. తనయంత వాఁడు లేఁడను
కొనిరొమ్ములు విఱుచుకొనుచుఁ గొమ్ములుదిరుగన్
దనకాలి నేలనూఁదక
యనయమెగిరిపడుచు మిటమిటాడుచు నడచున్. 39

క. తనుఁగారణ జన్మునిఁగా
దనశక్తి విశిష్టముగను దలఁచు కొనుమదిన్
దనధూర్తతనార్జవముగ
దనయోగ్యత శౌర్యముగను సంభావించున్. 40

క. అరయంగ హస్తిమశకాం
తరమున్నది తనకు నన్యునకు నని తలఁచున్
మెఱయింప నడంకువ వం
కర దండంబులను బెట్టుఁ గడునొక్కెడలన్. 41

క. తెలిసిన వార లెదుర్పడఁ
దొలిఁదానయి పల్కరింప దోసమటంచున్
దలఁచునొ? నోటను ముత్యం
బులు రాలునొ? మూతిముడిచి పోవుచునుండున్. 42

ఆ. వె. వ్రేలుపెట్టుకున్నఁ గూలంకషప్రజ్ఞ
సకలకళలసర్వశాస్త్రములను
అభినయించు, నయ్యలచ్చెఱుపాటొంద
నవ్వుకొనఁగ బుధజనంబెడంద. 43

చ. పలుకఁడు పల్కరించినను
బ్రాఁతచెలుల్ నడిబాట, నోరగాఁ
దొలఁగుఁబరాఙ్ముఖుండయి, యె
దో! విధిలేకయు మాటలాడఁగా
వలసిన రెండుముక్తసరి
పల్కులు పల్కును జూచుచున్ దెసల్
అలుపపుజీతగాండ్రఁ గలి
యందదిగౌరవమార మంచెదన్. 44

క. తన చిగిలింతైశ్వర్యముఁ
గనుఁగొనుచున్ గన్నుమిన్నుఁ గానకమురియున్
ధనహీనుల వికలాంగులఁ
గనియపహాస్యంబతండు గావించుఁగడున్. 45

గీ. పండిముగ్గిన ముదుసళ్లఁ బాఱఁ ద్రోలెఁ
దల్లిదండ్రులఁ, జదువుసంధ్యలను గఱపి
యరయకయుఁ దమ్ముగుఱ్ఱలఁ దఱిమివైచెఁ
జుట్టపక్కంబులకుఁ గొక్కువెట్టెనతఁడు. 46

క. తన్నాశ్రయించు వాగల
సన్నిధిలోఁ లేఁతలేఁత సొరకాయలు కోఁ
యున్నిచ్చుఁ, బ్రక్కతాళముఁ
బన్నంగా వారు దినము భజనలు సాగున్. 47

గీ. రమ్మని పురందరుఁడు నాకు రథముఁబంపె;
బాల్యమున దాదియై లక్ష్మి పాలనిచ్చె;
వానధారల సందునంబఱవనేర్తు
వని యసంభావ్యములఁ బల్కుటతని ప్రకృతి. 48

క. తన తిన్నది బంగారం
బనుఁదనచేయునవి యజ్ఞయాగ క్రతువుల్
తనమాట వేదవాక్కని
యును దనువర్ణించుకొను బహుముఖములనొగిన్. 49

క. అనవసరమ్ముగ జోక్య
మ్మునుగొని పరులాడుచున్నముచ్చటలను ద్రి
ప్పను విషయాంతరములకుం;
దనఘనతను దూర్చుచును సతము భాషించున్. 50

ఆ. వె. నందియన్ననంది పందియన్నంబంది
యనుచుఁ గొన్ని గ్రహములతనిఁ గొలుచు
నాత్మగౌరవంబు నతకరించి చరింప
వారికెట్లు సాధ్యపడునో ? తెలియ. 51

క. తదనుగ్రహంబుఁ బడయఁగఁ
నెద గోరుచుఁ జంద్రుఁడవు మహేంద్రుఁడవనుచున్
బెదపెద్దలుఁ గైవారముఁ
జదువుదు రా పరమపురుషు సన్నిధి సతమున్. 52

గీ. పెద్ద చదువులు చదివి ప్రవీణులయిన
వారు యాచింప నుద్యోగవాంఛఁదన్ను
రేపురా! మాపురా! యంచుఁ ద్రిప్పి త్రిప్పి
విసువుఁబుట్టించు దర్శనం బొసఁగ కతఁడు. 53

క. పనివడి తన యింటికి వ
చ్చిన యెవ్వరిఁ గూరుచుండఁ జెప్పఁడు ద్వారం
బున నిలిచి మాటలాడుచుఁ
బనుపునతఁడు బయటివారి బయటికె వేగన్. 54

క. తనక్రింద జీతగాండ్రను
గొనకొని పనిఁ గ్రుక్కి వేపుకొనితిను; నేరం
బును వెదకుశిక్ష సేయఁగఁ
దనవేతన వృద్ధికై యతండల్పమతిన్. 55

చ. తుమతుమలాడుచున్ మొగము
తుమ్ములలోపలఁ బ్రొద్దుగ్రుంకు చం
దము వహియింప, సేవక జ
నంబులఁగంకును, జీదరించు, వ్య
ర్థముగఁ జివాట్లుపెట్టు నప
రాధలవంబు నెసంగకున్న నీ
క్రమమునఁ జెల్లునంచు నధి
కారమొనర్చు నతండు మూర్ఖతన్. 56

ఆ. వె. వంగిదోసి లొగ్గి పరమవిధేయులై
బెదరి బెదరి విన్నవించువారి
మొగముఁగనక బిఱ్ఱబిగియంగఁ గూర్చుండి
కట్టెవిఱిచినట్లు గావచించు. 57

క. తనవ్రాసిన వ్రాఁతలఁ, జే
సిన చేఁతలఁ, దప్పు లెన్నుచిన్నల నదరిం
చును బెదరించును దొలఁగిం
తునునినుఁ బనినుండియనుచుఁదుదిఁ దొలఁగించున్.

క. పలికెడివి ధర్మపన్నం
బులుఁ జేసెడిపనులు ఘోరములు విన; దడిగు
డ్డల గొంతుఁగోయు వీరులు
పలువుండ్రధికారులిట్టి వాండ్రందురిలన్. 59

క. కడచును వర్షాకాలం;
బడఁగునుదన త్రుళ్లుపాటు; నవశేషించుం
బుడమినిఁదట ద్రుమంబులఁ
బడఁద్రోసినయట్టి ఘోరపాపమె నదికిన్. 60

చ. తనుఁ గనినంత లేచి తమ
తావులనుండి, నమస్కరించుచున్
వెనుకొని వచ్చుచున్న జన
బృంద మలక్ష్యతఁ జూచిపల్కుచున్
జను; దనకట్లొనర్పని జ
నంబుల నాతఁడు మిట్టిమిట్టి చూ
చును; గడుమూర్ఖులంచుఁ దల
చున్ స్వమహత్త్వ మెఱుంగఁ జాలమిన్..

క. ఒడలడ్డంబుగఁ బెఱుగుట
నడునెత్తిఁ గన్నులుంట నడచుచుఁ గ్రిందం
బడకుండ హెచ్చరించుచు
వెడలుదు రొకకొంద ఱతని వెంబడి వీధిన్. 62

గీ. పరుల నువ్విళులూర్పనో ? వైభవమున
నిజ విశిష్టతఁజూపనో ? నిచ్చలతఁడు
పూను వెలలేని క్రొంగ్రొత్త పుట్టములను
శ్రేష్ఠతరయానముల సంచరించుచుండు. 63

క. నడుమంత్రపు సిరిగలయా
తఁడు వెన్నెలవడకు గొడుగుఁదాల్చును; వెడలున్
మిడిమధ్యాహ్నంబునఁ గా
గడాలు వేయించుకొని తగక వాడబడిక. 64

క. దొరలించు నాత్మ దురితము
పెఱలసిరసుపైకి; బలిమిఁ బెఱకికొను నిం
కరుల యశముతనదని; యే
డ్తెఱఁ దిమ్మిని బ్రహ్మిఁబ్రహ్మిఁ దిమ్మి నొనర్చున్. 65

చ. నిలిచినఁ గూరుచున్న గమ
నించుచునున్న నెవేనిముచ్చటల్
పలుకుచునున్నఁ గ్రొత్త కళ
లన్ విసరున్ దనయందు దర్పమ
గ్గలముగ వేఱు దన్నుకొనఁ
గా, నడుమంత్రపు కల్మిప్రాఁతకల్
సలిపిన కైపుచే నతఁడు
స్వస్థత మాలిన మానసమ్మునన్. 66

గీ. వీని తెలివియెల్లఁ బెడతలంబట్టెఁబో!
వెఱ్ఱి తలలు వేసె వీనిబుద్ధి
బలిసె మొఁడితనము; పట్టఁబగ్గములులే
వితని నంచుఁ బెద్ద లెల్లరనిరి. 67

చ. చొరఁబడి కల్ల పెత్తనముఁ
జూపుఁ బ్రజాహితకార్యమందు; ముం
దరికిని ద్రోసికొంచుఁ జను
ధైర్యమొలర్పఁగ రాజభక్తి సం
గరమున వీరుఁడట్టు; లధి
కారి జనంబుల వెంటనంటుచున్
దిరుగును దోఁకఁ బోలెను వి
ధేయతఁ జూపుచు వారియాజ్ఞలన్. 68

చ. సలుపుచుఁ బాదసేవఁ, దలఁ
జల్లుచుఁ ద్రావుచుఁ బాదతీర్థముల్
గొలుచుచుఁ దత్ప్రసాదములు
గొంచుఁజరింపఁ బ్రసన్నచిత్తులై
యలపరిబాలకుల్, తమకు
నాతఁడు నమ్మినబంటటంచు మి
క్కిలిఁగొని యాడుచుండిరి యొ
గిన్ బహుమానపురస్సరంబుగన్. 69

క. వరవుడపు బడగ యోయన
బరిపాలకులిడిరి బిరుదువానికి; దానన్
నరనరములయందును రో
మరోమములయందుఁ బ్రాఁకె మదమాతనికిన్. 70

క. వినునపుడు పరులనోటను
గనుఁగొనుచున్నపుడుఁ బత్రికాభాగములన్
దనబిరుదాక్షర పంక్తిని
జనింప రోమాంచమతఁడు చంకలుగొట్టెన్. 71

చ. అమృతపు బావిలోమునిగి
నట్లు, స్వమస్తకమందుఁ బుష్పవ
ర్షముపడినట్లు, వేల్పులు వ
రంబు లొసంగినరీతిఁ, గోటిచం
ద్రము లొకతూరి యాత్మసద
నంబున వెల్గినభాతి, నప్సర
స్సముదయముల్ తనున్ వలచు
చందమునన్ ముదమయ్యెవానికిన్. 73

క. దేవత్వమబ్బినట్టులఁ
గైవల్యప్రాప్తిఁదనకుఁ గలిగినయటులన్
భావించును; సామాన్యుల
సేవపడన్ బసులఁబోలె వీక్షించునొగిన్. 73

ఆ. వె. తనకులభ్యమైనతన్మేరు శృంగంబు
నన్యులందఁగూడ దనితలంచు;
నెల్లమానవులకు స్పృహణీయమగుఁగాక
యాత్మభాగ్యమనుచు నతఁడుగోరు. 74

క. ఇదివఱకుఁ దోఁకయొక్కఁడె
కోఁడవవడియెఁ; దీఱెఁనట్టి కొఱఁతయు నేఁడో
ప్పిదముగ సంపూర్ణత్వము
కుదిరె నితనికనుచు నవ్వుకొనిరి జనంబుల్. 75

ఆ. వె. అతనిగుఱించి వచ్చునట్టి ముచ్చటలందు
వెక్కిరింపు పొంటెఁ బేరఁగొనక
యతఁడు వినెడిపగిది నాబాలగోపాల
ముచ్చరించు బిరుద మొండయెత్తె. 76

ఆ. వె. తోఁకమొలచు మొదలు దొరకు సేవకులపై
దూఁకుడెక్కువయ్యెఁ దొంటికంటెఁ;
గక్కసించుఁ; జింపి కాగితంబులకట్ట
మొగముపై నిఁగొట్టి పోవుచుండు. 77

మ. జరిమానాతగిలించు దుర్భరముగా
స్వల్పాపచారంబు సే
కురినన్, దిట్టును బెట్టిదంబుగను, జీ
కొట్టున్ విశేషించి, యె

త్తటియందున్ సెలవీకచంపును, నితాం
తం బేడిపించుం, గడున్
గటువంబోవు, మొఱుంగు, మండిపడు, దు
ర్గర్వాంధ చేతస్కుఁడై.

గీ. నులుముఁ జెవులను; మొట్టికాయలను మొట్టుఁ;
జెంపకాయలు వడ్డించుఁ జెప్పనేల ?
వానిదివ్వీటి యివ్విధి భగ్గుమనుచు
మండుచున్నది చమురన్నమాట లేక. 79

గీ. మానముంజంపుకొని, యవమానరాశి
రోసియుఁ గ్రమక్రమముగ నభ్యాసపడుచుఁ,
గడుపుఁ గక్కుర్తిమోయి జీతగాండ్రదెల్ల
నోరుమూసి భరించిరి మారునాక. 80

గీ. మద్దెలయు రోలువలె స్వసమ్మర్దపాటు
లొండొరులుగూడి చెప్పుకొన్నుండ్రువారు
ఆర్చితీర్చుట లేకున్న నాత్మశాంతి
యలఁతిగ లభించుఁ దమకన్న యాసఁజేసి. 81

క. నడివేసఁగి మధ్యాహ్నపు
మిడిమిడి యెండను హసించి మినుమిక్కిలిఁగా
ల్చెడునతనిదగు ప్రతాపము
నడుమంత్రపు కలిమిబలిమి నానిట్టిదెకా ! 82

క. తనభార్య చావుబ్రదుకుల
మునింగియున్నట్లుఁ జూచిపొమ్మనియును వ
చ్చిన జాబుఁజూచి సెలవును
గొన నొకఁ డొకనాఁడు వానికురఁగట కరిగెన్. 83

క. అరుదెంచి వందనమునా
చరించి చూపించి తీసి జాబును నేదో
మొఱపెట్టుచుండె హృదయము
కరగు నటుల నశ్రులురులఁ గన్నులయందున్. 84

క. మొఱవినక జాబుఁజదువక
చుఱచుఱనవ్వానిఁ జూచుచునుదొర లేఖం
బరపరన చింపి పండ్లను
గొఱుకుచు సెలవీక కారుకూఁతలు కూసెన్. 85

ఉ. ఇవ్విధి చొంగయుత్తరము
లెన్ని సృజింతువో! యింకముందు నీ
క్రొవ్వడఁగింపకున్ననని
గొంట్రిలు క్రొల్పులిరీతిఁ గన్పడన్
నెవ్వగఁ గూరుచాతఁడు వి
నీతినిఁ బల్కుచు వాని కాళ్ళపై
నవ్విధినైనఁ గావుమని
యేడ్చిపడెంగడు జాలిఁగొల్పుచున్ 86

క. సివమెత్తియుంటఁ జేసిన
దవుగాదనువాఁడులేమి నక్కటికంబున్
లవమును జూపకనన్నుం
దవులుదువే? యనుచు వానితలపైఁదన్నెన్. 87

ఆ. వె. కానికూళ్లు గుడిచి కానిపనుల్ చేసి
సిగ్గు బిడియములఁ ద్యజించివేసి
పాపమన్న కొంకువదలివర్తించుట
తప్పుగాదొ? కాళ్లఁదాఁకఁ దప్పొ? 88

క. సెలవడుగుట యపచారమొ?
యలయడుగులపైని వ్రాలు టపరాధంబో?
కులసతి రోగపు దాసఁగొ?
తెలియదు ఘనకతనితప్పు తెలిసిన కథలన్. 89

క. హృదయంబు మండు చుండెను
మొదటనె తన పడఁతి రోగమున, ఘృతమయ్యెన్
బదపడి పరాభవంబిఁకఁ
గుదుటఁ బడునె నిప్పుఁద్రొక్క క్రోఁతిగనయ్యెన్. 90

క. తిరిగెఁదల, వశముదప్పెను
శరీరమునఁ, దన్ను నెదిరి సంపూర్ణముగా
మఱచె, నొడలు పెరిగె, భయం
కరుఁడగు కాలాగ్నిరుద్రకల్పుండయ్యెన్. 91

క. తన్ను పడిలేచి యాతఁడు
మున్నెన్నఁడులేని మొరటు పొగరుబుకఁగ మే
నన్నిప్పు లురులఁగన్నులఁ
బన్నుగ దొరఁజెప్పుఁ దీసి బడబడ బాదెన్. 92

శా. నీచా! నీదగుకొల్వునన్ బ్రదుకుకం
టెన్ బోయి యూరూర భి
క్షాచర్యంగొని కాలమున్ గడపినన్
సౌఖ్యంబు సంధిల్లు; ధా
త్రీ చక్రంబపవిత్రతం గొనియెఁద్వా
దృక్పాపకీటంబులన్
ఛీ! చీ! నిన్గన దోసముబ్బునని ని
ష్ఠీవించె నవ్వానిపై. 93

క. మరలి గిరుక్కున వెనుకకుఁ
జరచరఁ దనయింటికతఁడు సాగెను; మన యీ
దొర సగము చచ్చె నొక నె
త్తురుచుక్కయు మొగమునందుఁదోఁపక యుండెన్. 94

క. తనపొగరె బెడిసి కొట్టెను;
దనపాపంబులె ఫలించి తన్నుంగుడిపెన్
తనవ్రాఁత బయల్పడెనా
దినమందున వాని బ్రదుకు తెల్లారెఁగదే! 95

క. తనజీతగాండ్ర యెదుటనె
తనకిట్లవమానమగుటఁ దలయెత్తక కొ
ట్టినపాముఁబోలెనదనోద
వినఁజంపక వీనినింక విడువననుకొనెన్. 96

క. సరియగు ప్రాయశ్చిత్తము
జరిగె; నితఁడు పొందెఁ దగ్గశాస్తినిఁ; గలిగెన్
బరిపూర్ణశృంగభంగము
చరితార్థుండనిరి కార్యసాధకుని జనుల్. 97

క. పెట్టినఁదినవలెఁ, బడవలెఁ
గొట్టినయెడఁ, జేయి చేసికొనవచ్చునొ కో?
యిట్టులసేవకుఁ, డిటుపై
బొట్టెట్టులఁ గడచుననిరి పోరి దద్దమ్మల్ 98

క. పరిభూతుఁడయిన తొట్టిగఁ
బరభృత్యులకలుచ యయ్యె; వారలపయి గ్రు
డ్డుఱుముటలుమానె, నోటివ
దరుడులు గట్టువడె; ధూమధామము లడంగెన్. 99

చ. కొలఁదిదినంబు లేగఁ దనకుంబయినున్న మహాధికారితో
నలఁతిగ ద్వేషభావముదయంబయి మెల్ల దినక్రమంబునన్
బలియుటఁ జేసి, పట్టుదలఁబట్టియు నాయధికారి యాతనిన్
గొలువుఁదొలంగఁ జేసెవినఁ గోరక చేసినవిన్నపంబులన్ 100

క. కోరలు వెలికిన పాముగ
నోరువడిన కుక్కయై మనోవ్యాధితగన్
వేరింగలియక యుశవా
కారంబును దాల్చియింటఁ గాడ్పడియుండెన్. 101

ఆ. వె. కొంతకాలమిట్లు చింతల వంతల
మునిఁగి మునిఁగి ముండమోఁపివోలెఁ
గొలువులేమిఁ జేతి కలగంతగ్గుటఁ
బలుకుబడియు వెనుకఁ బడుటఁగాంచి. 102

శా. వ్యాపారంబొనరించి ద్రవ్యమును సంపాదింతుఁగాకంచుఁ దృ
ష్ణాపూర్ణుండయియున్న మూలధనముఁ సర్వంబు వెచ్చించి ప్రే
రేఁపింపందనుఁ బూర్వకర్మము పౌనర్భ్వన్ వాఁడు నానావిధ
వ్యాపారంబుల నేక కాలమున నత్యంతవ్యయారంభుఁడై. 103

శా. చీనాదేశపుఁ బట్టు పుట్టములుఁ గాశ్మీరంపు దుస్సేలువల్,
పూనాజీరలుఁ, జెన్నపట్నపునగల్, ముంబాపురీ వస్తువుల్
నానాయంత్రములన్ విదేశముల, ధాన్యంబుల్ స్వదేశంబునన్
జానారంగొని తెచ్చి 'జై' యన దెసల్ సాగించె వాణిజ్యమున్.

ఆ. వె. తిండికైనఁ దినఁగఁ దీటిక లేకయు
నేలకంటికొన్న యోలినెపుడుఁ
గూరుచున్న తావుఁ గూడ వీడకతండు
కాయ గాయ చేయి, వ్రాయఁదొడఁగె. 105

ఆ. వె. తమ్ము విశ్వసించి సొమ్మెల్లఁ జేతికి
నప్పగింపనాతఁ, డదనెఱింగి
మ్రింగి జీతగాండ్రు దొంగలెక్కలుచూపి
ముంచిరతని త్రాడుత్రెంచియేట. 106

ఆ. వె. మొదటమొదటఁ గొలఁది యొదవెంలాభంబందుఁ
బిదపఁదీసికట్టు మొదలుపెట్టె
నున్నవిత్తుకాయ లూడె నానాఁటికిఁ
జివరకతని చెయికిఁ జిప్పవచ్చె. 107

క. నడుమంత్రపు సిరియనఁగాఁ
బుడమిం దాటాకుమంటపోలిక మండున్
గడుకొని చల్లాఱఁగనం
బడదదరును దుమ్ముదక్కఁ బరికింపంగన్. 108

క. తలక్రిందులగును గాలము;
కలకాలంబేక ధాటిగా సాగునొకో?
ఇలపయి బండ్లోడలు నో
డలు బండ్లగునని వినంబడదె? పెద్దలనన్. 109

క. అరుదుగ భువి నడుమంత్రపు
సిరి యొదవఁగఁ దనకు గర్వచిత్తుఁడయి యొడల్
విఱుచుకొనితిరుగ కడఁకువఁ
జరించు వేయింటికొకఁడె! జనబృందమునన్. 110